ఈ విషయంలో మన మహర్షులేమన్నారో తెలుసుకుందాము.

కణాద మహర్షి స్థూలదృష్టితో ప్రపంచాన్ని పరిశీలించగా వారికి సృష్టిలో 9 రకాల ద్రవ్యాలు (పదార్థాలు) కనబడ్డాయి. మహర్షి వాటిని తమ వైశేషిక దర్శనంలో ఈ విధంగా సూత్రీకరించారు.

**"పృథి వ్యాపస్తేజో వాయు రాకాశం, కాలో దిగాత్మా మన ఇతి ద్రవ్యాణి"**

– వైశేషిక దర్శనం (1-1-5)

అంటే– ఈ సృష్టిలో భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు అనబడే 9 రకాల ద్రవ్యాలు (పదార్థాలు) ఉన్నాయన్నారు. వీటిలో ఆత్మ ఒక్కటే జ్ఞానం కలిగినదనీ, అది ఆది అంతములులేని నిత్యపదార్థమనీ వారి దర్శన శాస్త్రంలో అన్నారు. ఇంతేగాక, వారు ప్రపంచంలోని సుమారు 25 గుణాలను లెక్కించి ఏ పదార్థంలో ఏ ఏ గుణాలున్నాయో వివరించి చెప్పారు. తర్కబద్ధంగానూ నిరూపించారు. ఆ వివరాలు 'వైశేషిక దర్శనం'లో చదవండి. మనం ప్రస్తుతం జడపదార్థాలైన ఎనిమిదింటికి మూలమైన మూల పదార్థాన్ని – ప్రకృతిని గురించి తెలుసుకుందాము.

మూల ప్రకృతిని గురించి లోతుగా అధ్యయనం చేసిన వారిలో కపిల మహర్షి అగ్రగణ్యులు. వారు వారి అధ్యయన సారాంశాన్ని తమ సాంఖ్యదర్శన శాస్త్రంలో ఈ విధంగా సూత్రీకరించారు.

**"సత్వ రజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః ;**
**ప్రకృతేర్ మహాన్, మహతో అహంకారః ;**
**అహంకారాత్ పంచ తన్మాత్రాణి ఉభయమింద్రియం ;**
**తన్మాత్రేభ్యః స్థూలభూతాని ;**
**పురుషః ఇతి పంచవింశతిర్గణః "**

– సాంఖ్యదర్శనం (1-61)

ఇది చాలా గంభీరమైన విషయం కనుక జాగ్రత్తగా అర్థంచేసుకునే ప్రయత్నం చేద్దాము.

<u>సత్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః</u>

అంటే – సత్వము, రజస్సు, తమస్సు అనబడే మూడు రకాల అత్యంత సూక్ష్మకణాలు సామ్యావస్థలో ఉండే స్థితిని ప్రకృతి అంటారు. అవే సృష్టిలోని

జడపదార్థాలన్నింటికి మూలకణాలు. వాటినుండే క్రమపరిణామం చెందుతూ నేడు వైజ్ఞానికులు చెప్పే పరమాణువులుగా ప్రోటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్‌లుగా అయ్యాయి. ఆ స్థూల పరమాణువులు వివిధ నిష్పత్తులలో మేళవింపబడి మూలకాలు (Elements) గానూ, వివిధ సమ్మేళనాలు (Compounds) గానూ రూపుదిద్దుకొని వివిధ పదార్థాలుగా తయారై మన కంటికి కనబడుతున్నాయి. లేకుంటే మూల ప్రకృతిని మనం చూడలేము. అత్యంత శక్తిగల సూక్ష్మదర్శినికి కూడా అవి కనబడవు. ఎందుచేతనంటే మన అనుభవంలో ఉన్న 'మనస్సు, బుద్ధి' కూడా మూల ప్రకృతి నుండి తయారైనవే. వాటిని మనం చూడలేము కదా! కపిల మహర్షి తదుపరి వాక్యాలలో ఈ విషయమే తెలుపుతున్నాడు.

<u>ప్రకృతేర్ మహాన్</u> :- అట్టి అత్యంత సూక్ష్మప్రకృతినుండి ముందుగా మహాన్ (మహత్త్వం) అనబడే పదార్థం పుడుతుంది. దానితోనే సృష్టికర్త మానవులలో కనబడే బుద్ధిని తయారు చేశాడు. మనకు కొద్ది కొద్దిగా యిచ్చాడు. మనం గట్టి ప్రయత్నంచేస్తే అది చాలా వికసిస్తుంది.

<u>మహతో అహంకారః</u> :-ఆ మహతత్త్వాన్ని కొద్దిగా స్థూలంచేసి 'అహంకారం' అనే పదార్థాన్ని తయారు చేశాడు. ఇచట అహంకారం అంటే మానవులలోని "నేనే గొప్ప అనుకునే అహంభావం" కాదు. ఇదిసూక్ష్మపరమాణువులతో ఏర్పడిన ఒక జడపదార్థం.

<u>అహంకారాత్ - పంచ తన్మాత్రాణి, ఉభయమింద్రియం:</u>

అహంకారం నుండి పంచతన్మాత్రలనే అయిదు రకాల సూక్ష్మపదార్థాలు నిర్మింపబడ్డాయి. వీటిని శబ్ద స్పర్శ రూప రస గంధ తన్మాత్రలంటారు. ఆ అహంకారంతోనే మన శరీరాలలోని పంచ జ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు మరియు వీటిని సంయుక్తంచేస్తూ జీవునితో కలిపే మనస్సు నిర్మించబడతాయి. అహంకారంతో పుట్టినవి మొత్తం 16 (5+5+5+1).

ఇక్కడ ఇంద్రియాలంటే మనకు కనబడే కన్ను, చెవి, ముక్కు, నాలుక మొదలైనవికావు. వాటిలో అదృశ్యంగా ఉండే చూచేశక్తి వినేశక్తి మొదలైనవని గ్రహించాలి.

<u>తన్మాత్రేభ్యః స్థూలభూతాని:</u>- అహంకారంలోని ఒక భాగంగా పుట్టిన తన్మాత్రలనుండి మనకు కనబడుతున్న స్థూలభూతాలు - పృథివ్యాపస్తేజో వాయు

రాకాశాలు పుట్టాయి. అందుచేతనే పంచభూతాలలో పంచగుణాలు ప్రధానంగా కనబడుతున్నాయి. వాటిని గ్రహించగల పంచజ్ఞానేందియాలను సృష్టికర్త మనకు అహంకారం అనే పదార్థంతోనే నిర్మించి యిచ్చాడు. ఈ పరిణామాలన్నీ కలిపితే 24 అవుతాయి.

ఇవన్నీ మూల ప్రకృతి నుండి క్రమంగా ఏర్పడిన జడ పదార్థాలే కాని, ప్రాణులలో సుఖదుఃఖాలను అనుభవించే జ్ఞానం కనబడుతున్నది కదా! ఈ జ్ఞానం ప్రకృతి పదార్థాల కలయికవల్ల క్రొత్తగా పుట్టిందికాదు. జడం నుండి జ్ఞానం పుట్టడం అసంభవం. కనుక ప్రకృతికన్న వేరుగా జ్ఞానం కలిగిన పదార్థం మరొకటి ఉందని అంగీకరించవలసివస్తుంది. దానినే కపిల మహర్షి - పురుషుడు అంటారు.

"+పురుషః ఇతి పంచవింశతిర్గణః" అన్నారు. అంటే "సృష్టిలో జడప్రకృతితో బాటు జ్ఞానంకల పురుషుడు (జీవుడు) అనబడే జీవతత్త్వం కూడా ఒకటి ఉంది" అన్నారు. ఆ జీవతత్త్వం ప్రకృతికన్న పూర్తిగా భిన్నమైనదని తమ సాంఖ్యదర్శనంలో తర్కించి నిరూపించారు. ఈ రెండేగాక, పరమాత్మతత్త్వం మరొకటి ఉన్నదని నిరూపించారు. పై 24 తో ఈ పురుష తత్త్వాన్ని కూడా కలిపి మొత్తం (పంచవింశతిః+గణః) 25 అని లెక్కించారు.

మన వేదశాస్త్రాలన్నిటిలోను విశ్వసృష్టికి మూలం ప్రకృతి అనియే చెప్పబడింది. అది జడము - జ్ఞానంలేనిది. కనుక తనంతతానుగా విశ్వంకాలేదు. అట్టి ప్రకృతిని-

**"ఏకో వశీ సర్వభూతాంత రాత్మా, ఏకం రూపం బహుధా యః కరోతి"**

- కఠోపనిషత్తు (5-12)

సర్వ భూతాలకు అంతరాత్మయు, ఒకే ఒక్కడు, సర్వాన్ని వశంలో ఉంచుకొన్న వాడునైన ఏ పరమాత్మ ఉన్నాడో అతడే ప్రలయకాలంలో ఏకరూపంగాఉన్న ప్రకృతిని అనేకవిధ రూపములుగా సృష్టిగా చేయుచున్నా డంటాయి మన ఉపనిషత్తులు.

ఆ ప్రకృతి మూడు రకాల పరమాణువుల మిశ్రమ పదార్థం. సృష్టికర్త వీటిని హెచ్చు తగ్గులుగా కలిపి పరమాణుబంధంవేసి వివిధ మూలకాలుగా (Elements గా) నిర్మించాడు. ఆ మూలకాల సమ్మేళనమే ఈ విశ్వం. ఇక మనం

సృష్టికర్త వేదాలలో సంక్షిప్తంగా చెప్పిన సృష్టిక్రమాన్ని గురించి తెలుసుకుందాము.

ఋగ్వేద దశమ మండలంలోని 190వ సూక్తం అఘమర్షణ సూక్తమనే పేరుతో ఆధ్యాత్మిక క్షేత్రంలో ప్రసిద్ధి పొందింది. సస్వర వేదపాఠం చేసేవారంతా - "అథ అఘ మర్షణ సూక్తమ్" అంటూ ఈ సూక్తాన్ని పఠిస్తారు. కేవలం మూడు(3) మంత్రాలుగల ఈ చిన్న సూక్తం సృష్టిరచనను సంక్షిప్తంగా చెబుతుంది. ఈ మంత్రాలకు అఘమర్షణో మధుఛందసుడు ఋషి. అంటే - ఆ పేరుగల ఆది ఋషి ఈ మంత్రాల అర్థాన్ని మనన చింతనలు చేస్తూ యోగసాధనచేసి సమాధిస్థితిలోనికి వెళ్ళాడు. అంతర్యామి సాక్షాత్కారంపొంది ఆయనద్వారా ఈ మంత్రాల అసలు అర్థాన్ని తెలుసుకున్నాడు. తను తెలుసుకున్న ఆ అర్థాలను శిష్యులకు, తోటి మానవులకు వివరించి చెప్పాడు. ఈ మంత్రాలలో విశ్వ సృష్టిరచన సంక్షిప్తంగా ఉందనీ, వీటిని అర్థభావనతో పఠిస్తే విశ్వాత్మ సర్వవ్యాపకుడు, సర్వశక్తిమంతుడునని గ్రహించి పాపాలు చేయకుండా ఉంటారనీ బోధించాడు.

సంస్కృతంలో 'అఘ' మంటే పాపమని అర్థం. 'మర్షణ' మంటే పోగొట్టుకోవటం అని అర్థం. 'అఘమర్షణం' అంటే పాపాలు పోగొట్టుకోవటం. అయితే ఇక్కడ ఈ మూడు మంత్రాలు పఠిస్తే చేసిన పాపాలు పోతాయనికాదు. పాపం చెయ్యకుండా ఉంటామనీ, పాపభీతితో జీవనయాత్ర సాగిస్తామనీ అర్థం. ఈ వేదఋషి అసలుపేరు మధుఛందసుడు. ఆయన ఈ పాపనిరోధక మంత్రార్థద్రష్ట కనుక అతనిని గుర్తిస్తూ ప్రజలు 'అఘమర్షణో మధుచ్ఛందసః' అని పిలుచుకున్నారు.

ఈ మంత్రాల దేవత 'భావవృత్తమ్'. వేదప్రకరణంలో 'దేవత అంటే - ఆ సూక్తం లేదా ఆ మంత్రం చెప్పే విషయం. "Subject of the Suktam or Mantra" అని అర్థం. 'భావవృత్తమ్' అంటే భావించబడిన - ఊహించబడిన వృత్తం (వలయం). మబ్బులులేని ఒక రాత్రి మనం ఆకాశాన్ని పరికించి చూచినట్లయితే అనేకానేక నక్షత్రాలు అన్నివైపులా కనబడతాయి. అవన్నీ భూమిచుట్టూ ఒక వలయంగా - వృత్తంగా ఉన్నట్లు అనిపిస్తుంది. అట్టి నక్షత్రవలయాన్నే మన ఋషులు భావవృత్తమనీ, కాంతివృత్తమనీ, ఖగోళవృత్తమనీ పేర్కొన్నారు. ఇక్కడ ఈ మంత్రాలలో ఆ భావవృత్తం (అనేకానేక నక్షత్ర కుటుంబాల) సృష్టి ఎలా జరిగిందో చెప్పబడింది. ఇక ఆ మంత్రాలగురించి ఆలోచిద్దాము.

## అథ అఘమర్షణ సూక్తమ్

ఓ3మ్ ఋతం చ సత్యం చ + అభీద్ధా తపసో౽ ధ్యజాయత,
తతో రాత్ర్యజాయత, తతః సముద్రో అర్ణవః ॥ (1)
ఓ3మ్ సముద్రా దర్ణవాదధి సంవత్సరో అజాయత ।
అహోరాత్రాణి విదధద్ + విశ్వస్య మిషతోవశీ ॥ (2)
ఓ3మ్ సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్,
దివం చ పృథివీం చ + అంతరిక్షమథో స్వః ॥ (3)

- ఋగ్వేదం (10-190-1 నుండి 3)

వాక్యార్థం :-

ఓ3మ్ :- ఇది మంత్రంలోని భాగంకాదు. ఏదైనా మంత్రాన్ని పఠించేటప్పుడు ఆ జ్ఞానాన్ని యిచ్చిన సృష్టికర్తను స్మరించటం వేదసాంప్రదాయం. సృష్టికర్తయొక్క గుణగణాలు, శక్తి సామర్థ్యాలు అనంతం. అందుచే గుణానికి ఒక పేరుగా అనేక నామాలు ఏర్పడ్డాయి. వాటిలో 'ఓ3మ్' అనేదే అతని ముఖ్యనామం - అసలు పేరు. అందుచే ఆ నామంతోనే స్మరిస్తారు.

1. ఋతం చ సత్యం చ అభీద్ధాత్ + తపసః+ అధ్యజాయత =
ఋత సత్యములు పరమాత్మ యొక్క ప్రకాశవంతమైన తపస్సుతో సృష్టిగా ఉత్పన్నమయినవి. ఋతం అంటే ప్రాకృతిక నియమాలు. సత్యం అంటే సత్వరజస్తమో గుణాత్మకమైన మూల ప్రకృతి (అవ్యక్తము). దీని భావమేమంటే - తనలో ఉన్న ప్రకృతిని సృష్టికర్త తన గొప్పదైన తపస్సుతో కొన్ని శాశ్వత నియమాలుగల విశ్వంగా నిర్మించాడని అర్థం.

తతః+రాత్రీ+అజాయత= ఆ పరిణామక్రమంలో ముందుగా ప్రళయరూప రాత్రి ఉత్పన్నమయ్యింది.

తతః+సముద్రః+అర్ణవః= దానినుండి అర్ణవ సముద్రం (పరమాణు సముద్రం) ఉత్పన్నమయ్యింది.

2. సముద్రాత్+ అర్ణవాత్+అధి+సంవత్సరః+అజాయత= ఆ అర్ణవ సముద్రం క్రమంగా ఒక చోటికి చేరి 'అధిసంవత్సర' నామక మహదండంగా ఉత్పన్నమయ్యింది. అంటే ఒక పెద్ద ముద్దగా (అండంగా) ఏర్పడింది. అది క్రమంగా కేంద్రంవైపుకు నొక్కివేయబడుటచే ఆ వత్తిడికి ప్రేలిపోయింది. ముక్కలు ముక్కలుగా విడిపోయి

విసిరివేయబడ్డాయి. దీనినే ఆధునిక వైజ్ఞానికులు "బిగ్‌బ్యాంగ్" జరిగిందంటున్నారు.
అహోరాత్రాణి విదధద్+విశ్వస్యమిషతః+వశీ= బిగ్‌బ్యాంగ్ జరిగిన తరువాత విసిరివేయబడిన ఆ ముక్కలు నక్షత్రాలుగా ఏర్పడ్డాయి. అవి మరల కేంద్రిక వత్తిడికి గురియై ప్రేలిపోయి గ్రహ ఉపగ్రహాలై నక్షత్రాల చుట్టూ తిరుగుతున్నాయి. ఇవన్నీ తమలో తాము తిరుగుతూ, వాటి వాటి కేంద్రం చుట్టూ తిరుగుతున్నాయి. వాటిలో నక్షత్రాలను సూర్యులనీ, వాటి చుట్టూ తిరుగువానిని గ్రహాలనీ, గ్రహాల చుట్టూ తిరుగువానిని ఉపగ్రహాలనీ (చంద్రులనీ) వ్యవహరిస్తున్నాము. మన భూమికి ఒకే ఉపగ్రహం ఉంది. కాని కొన్ని గ్రహాలకు 2,3,4 ఉపగ్రహాలున్నాయి. అవి ఆ గ్రహాలకు చంద్రులన్నమాట. ఈ సూర్యకుటుంబాలలో సూర్యుడొక్కడే స్వయం ప్రకాశకుడు. తనలో ఉన్న హైడ్రోజన్ వాయువు హీలియం వాయువుగా మార్పుచెందుచున్నందువల్ల పెద్ద పెద్ద అగ్నిజ్వాలలు వెలువడి సూర్యులను ప్రకాశవంతం చేస్తున్నాయి. కనుక అవి స్వయం ప్రకాశకాలయ్యాయి. అట్టి ప్రక్రియ గ్రహాలలో జరగనందున అవి సూర్యప్రకాశంతో ప్రకాశితములౌతున్నాయి.

గ్రహాలు తమచుట్టూ తాము తిరుగుచుండటంవల్ల గ్రహాలపై సగభాగం సూర్యకాంతి పడి పగలుగాను, వెనుకవైపు రాత్రిగాను ఉంటున్నాయి. ఈ ఏర్పాట్లన్నీ వాటంతట అవి ఏర్పడినవికావు. 'వశీ' నామక విశ్వాత్మయే వాటిని అట్టి నియమాలతో బంధించి తన వశంలో పెట్టుకున్నాడని ఈ మంత్రం స్పష్టంగా చెబుతున్నది. ఈ ఒక్క మంత్రమేకాదు, సృష్టికి కర్త పాలకుడు ఒకడున్నాడని వేలకొలది మంత్రాలు చెబుతున్నాయి. ఇవన్నీ సహజంగా జరుగుచున్నట్లు కనబడుతున్నా వాటిని ఆవిధంగా ఏర్పాటు చేసిన జ్ఞానంగల తత్త్వం ఒకటి ఉండాలి. ఆటోమేటిక్ వాచీ తనంత తాను పనిచేస్తున్నా - తిరుగుతున్నా దానిని నిర్మించిన వైజ్ఞానికుడు ఒకడుండాలి కదా! కంప్యూటర్లు, రోబోలు వాటంతట అవి పనిచేస్తున్నా వాటిని కొందరు వైజ్ఞానికులు కలిసి నిర్మించారు కదా! కొన్ని ఇనుపముక్కలు వాటంతట అవి కలిసి ఆ యా యంత్రాలుగా కాలేదు కదా! అట్లే, సృష్టిని కొన్ని నియమాలతో బంధించి నిర్మించిన సర్వోన్నత విజ్ఞానవేత్తనే ఈ మంత్రం 'వశీ' నామంతో పేర్కొంటున్నది.

3. సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వం అకల్పయత్ = పూర్వకల్పంలో సూర్యచంద్రులను సృష్టించినట్లే ఈ కల్పంలోను - సృష్టిలోనూ సృష్టించినాడు. ఇంతేకాక, వాటిని ధరిస్తున్నాడు. ఆ యా స్థానాలలో భ్రమణం చేయిస్తున్నాడు.

దివం చ పృథివీం చ + అంతరిక్షమ్ + అథో స్వః = సూర్యచంద్రులను సృష్టించినట్లే ద్యులోక పృథివీలోకాలను, వాటిమధ్య ఉండే అంతరిక్షాన్ని, అంతరిక్షంలో ఉండే ఉపగ్రహాలను సృజించి ధరించి నియమించి నడిపిస్తున్నాడు.

విశ్వసృష్టిని గురించి నేటి వైజ్ఞానికులు భిన్నభిన్న అభిప్రాయాలను (Theories - వాదాలను) కలిగియున్నారు. డా. యాబీ లిమ్రేత్ పరిణామవాదాన్నీ, హెర్మన్ బాండీ, థామస్ గోల్డ్ కలిసి యథాస్థితి వాదాన్ని, R.C. టాల్మన్ పల్సేషన్ వాదాన్నీ (Pulsation Theory ని), జార్జ్‌గామో అనంత విశ్వవాదాన్నీ మరికొంతమంది మరికొన్ని వాదాలను ప్రతిపాదించారు. వీటిలో R.C. టాల్మన్ చెప్పిన విశ్వస్పందనవాదం ఈ అఘమర్షణ సూక్తానికి చాలావరకు సరిపోతుంది. ఆయన ఏమన్నారంటే -

విశ్వపదార్థమంతా 800 కోట్ల సంవత్సరాల కొకసారి దగ్గరగావచ్చి ఒక పెద్దముద్దగా ఏర్పడుతుందనీ, అది కేంద్రికవత్తిడికి గురియై ప్రేలిపోయి సూర్యకుటుంబాలుగా ఏర్పడతాయనీ అన్నారు. మన వేదశాస్త్రాలు 432 కోట్ల సంవత్సరాల కొకసారి సృష్టిఅంతా క్రమంగా పరమాణువులుగా విడిపోతుందనీ, అట్లే అది మరొక 432 కోట్ల సంవత్సరాలు ఉంటుందనీ దానినే ప్రళయ మంటారని చెబుతాయి.

ఇదీ సంక్షిప్తంగా అఘమర్షణసూక్తం చెప్పే సృష్టిరచన. దీనిని అర్థభావనతో పఠించుటవలన సృష్టికర్తయొక్క శక్తిసామర్థ్యాలు మనకు అవగతమౌతాయి. అతనిపై శ్రద్ధాభక్తులు ఇనుమడిస్తాయి. అతడు సర్వవ్యాపకుడై అన్నిటిని ధరిస్తూ, సర్వసాక్షియై మనంచేసే మనోవాక్కాయ కర్మలను చూస్తున్నాడు కనుక మనం పాపకార్యాలు చేయటానికి భయపడతాం. అతడు విధాత - కర్మఫలదాతకూడా కనుక పాపకార్యాలు చేయకుండా ఉంటాము. న్యాయాధీశుని ఎదుట చెడుకార్యాలు చేయలేము కదా! అందుకని ఈ మంత్రాలకు అఘమర్షణ మంత్రాలనే పేరువచ్చింది.

మహర్షి దయానందులవారు తాము సంకలనం చేసిన సంధ్యావందన విధిలో వీటిని చేర్చి, వాటికి సరియైన అర్థంవ్రాసి మనకు మహోపకారం చేశారు. వాటి తెలుగు అనువాదాలు ప్రచురింపబడ్డాయి. ఆ సంధ్యావందన విధి వైజ్ఞానికంగాను, హేతుబద్ధంగాను కూడా ఉంది. దాని పూర్తివిధియొక్క వైజ్ఞానిక సమాలోచన నా రచన "సంధ్యావందనము - వైజ్ఞానిక సమాలోచనము" లో చూడగోరుచున్నాను.

ప్రియపాఠకులారా! హేతు బద్ధంగాను, వైజ్ఞానికంగాను ఆలోచిస్తే సృష్టిలో ఈ మూడు పదార్థాలూ - దేవుడు, జీవుడు, ప్రకృతి ఉన్నాయి. ఈ మూడు అనాది పదార్థాలు. వీటికి ఆది అంతములుండవు. ఎప్పటికీ ఉంటాయి. అయితే వీటి పరిమాణాలు, గుణాలు, శక్తి సామర్థ్యాలు వేరువేరుగా ఉంటాయి. దేవుడు మిగిలిన రెండిటికన్నా పరిమాణంలోను జ్ఞానంలోనూ, శక్తిసామర్థ్యాలలోను చాలా చాలా పెద్దవాడు, గొప్పవాడు. అతనిలోనే కోటానుకోట్ల జీవులు, ప్రకృతి పరమాణువులు ఒక మూల పడి ఉన్నాయి. అవి ఒక దానికంటె మరియొకటి సూక్ష్మమైనవి. వీటిని గురించి సృష్టికర్త ఏమన్నాడో అతని మాటలలోనే తెలుసుకుందాము రండి.

## <u>వేదం త్రైతవాదాన్ని ప్రతిపాదిస్తుంది</u>

లోకంలో వాదాలు చాల ఉన్నాయి. వాదాలంటే సంప్రదాయాలు. విదేశీ మతాలలో 2,3 సంప్రదాయాలే ఉన్నాయి కాని మన వేదమతంలో (హిందూమతంలో) అనేక సంప్రదాయాలున్నాయి. ఎవరికి వారు మాది వేదప్రతిపాదితమే అంటారు. కొన్ని ఉపనిషత్తు వాక్యాలు చూపించి వాటికి వక్రంగా - తమకు అనుకూలంగా అర్థాలు చెప్పి వేరు వేరు సంప్రదాయాలు నెలకొల్పారు. కొందరు నవీన పురాణాలను పట్టుకొని మతాలను స్థాపించారు. ముందు శైవ సంప్రదాయం ప్రారంభమయ్యిందట. అనంతరం గాణాపత్యం, తాంత్రికం, చార్వాకం, అద్వైతం, ద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతాద్వైతం, మహాద్వైతం మొదలైన అనేక రకాల అద్వైతాలు పుట్టాయి. పూర్వం అడ్డబొట్టుకు, నిలువుబొట్టుకు వాదాలేకాక యుద్ధాలు కూడా జరిగాయట. ఈ మధ్య బ్రహ్మకుమారీలు, బాబాలు, అమ్మలు, స్వాములు చాలా వర్గాలనే తయారుచేస్తున్నారు. 'గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః' అని ఉపదేశిస్తూ గురువులే దేవుళ్ళవుతున్నారు. లేదా దేవుని అవతారాలౌతున్నారు. ఇంతకీ దేవుళ్ళెంత మంది ఉంటారు? సంప్రదాయానికి ఒక దేవుడు, వర్గానికి ఒక దేవుడు, మతానికొక దేవుడు ఉంటే పరస్పర రాగద్వేషాలు, అధిపత్య పోరాటాలు తప్పవుకదా!

పైన ప్రతిపాదించిన మతాలేవీ వేదమతాలుకావు. కొంతకొంత వ్యత్యాసంగానే ఉన్నాయి. అవన్నీ వారి కపోల కల్పితాలు, ఊహాగానాలు.

<u>ఉదాహరణకు:</u> ఆది శంకరాచార్యులవారు దశోపనిషత్తులను, భగవద్గీతను, బ్రహ్మసూత్రాలను ప్రామాణికంగా తీసుకొని వారి అద్వైతవాదాన్ని ప్రతిపాదించారు. ఈ మూడిటికి ప్రస్థాన త్రయమని పేరు పెట్టారు. వీటిలో ఒక్క ఈశోపనిషత్తు తప్ప మిగిలిన గ్రంథాలన్నీ వేదాలలో భాగంకాదు. వేదాలకు శ్రుతులు అని పేరు. అంటే

- సృష్టికర్త ఋషుల హృదయాలలో వినిపించినవి. ఆ నలుగురు ఆది ఋషులు. వారు విన్నది తమ బుద్ధులలో చక్కగా ధారణ చేసి వాటిని విన్నది విన్నట్టుగా శిష్యులకు నేర్పారు. ఆ విధంగా చాలాకాలం వరకు గురుశిష్యపరంపరగా వేదాలు వింటూ వచ్చినవే కనుక వాటికి శ్రుతులనే పేరు స్థిరపడింది. ఇప్పటికిని వేదపాఠీయులు శిష్యులచే స్వరసహితంగా కంఠస్థం అయ్యేవరకు వినిపిస్తూనే ఉంటారు.

సృష్టికర్త సృష్ట్యాదిలో వేదఋషుల హృదయాలలో ప్రకటించబడిన వేదం ఏమంటుందంటే -

ఓం బాలాదేకమ్ + అణీయస్కం, ఉతైకం నైవ దృశ్యతే ।
తతః పరిష్వ జీయసీ దేవతా సా మమ ప్రియా ॥

- అథర్వవేదం (10-8-25)

తాత్పర్యం : ఓ మానవులారా! ఈ సృష్టిలో వెంట్రుకమొనకన్నను సూక్ష్మమైన తత్త్వం ఒకటున్నది. (అది పరమాణువులు). అంతకన్నను సూక్ష్మతర తత్త్వం మరొకటున్నది. అది ఏ సూక్ష్మ దర్శినికీ కనబడనిది (అది జీవుడు). ఈ రెంటికన్నను సూక్ష్మతమ తత్త్వం వేరొకటున్నది. అది అన్నిటిని అన్నివైపులనుండి ఆలింగనం చేసుకొని అన్నిటిలోను ప్రవేశించియున్నది. (అది దేవుడు). ఆ సూక్ష్మతమ దేవతయే నాకు అత్యంత ప్రియమైనది.

The one (i.e., Atom) are even subtler than hair (the infinitesimal of hair); and one (i.e. souls) are invisible. But the subtlest and most pervading divinity is the only object of my love and devotion.

వైజ్ఞానిక వివరణ : మనం ఈ సృష్టిలోని పదార్థాలను విశ్లేషణ చేస్తే ఇదంతా అణువుల సంఘాతం -వివిధ మూలకాల (Elements) సమ్మేళనం. అన్ని అణువులలోను ప్రోటాన్, ఎలక్ట్రాన్, న్యూట్రాన్ లనే పరమాణువులే వివిధ నిష్పత్తులలో ఉంటాయి. వాటినే మన ఆధ్యాత్మిక శాస్త్రాలు, సత్త్వ రజః తమస్సులంటాయి. ఈ పరమాణువులకన్నను సూక్ష్మతర తత్త్వాలు మరికొన్ని ఉన్నాయి. వాటిని ఎంతటి బలమైన ఎలక్ట్రానిక్ మైక్రోస్కోపుతోను కూడా చూడలేము. అవే 'నేను, నేను' అని వ్యవహరించే జీవాత్మలు. ఇవియును అనేకం. ఈ రెంటికన్నను 'సూక్ష్మతమ తత్త్వం' పరమాత్మ. అది జడమైన జ్ఞానంలేని పరమాణువులను, జ్ఞానంగల జీవాత్మలను కూడా అన్ని వైపులనుండి ఆలింగనం చేసుకొని అన్నిటిలోనూ ప్రవేశించి, వ్యాపించి ఉన్నది. ఆ పరమాత్మ - విశ్వాత్మ సర్వవ్యాపకము, అఖండితము, సర్వజ్ఞము, సర్వశక్తిమంతము. ఆ దేవతయే - విశ్వాత్మయే మనకు ప్రియమైనది కావాలి.

దానినే మనం ఉపాసించాలి, ప్రార్థించాలి. అది మన శరీరాలలోను, మనస్సులోను, బుద్ధిలోను చివరకు జీవాత్మలమైన మనలోనుకూడా వ్యాపించి ఉన్నది. కనుక మనం అంతర్ముఖులమై ఉపాసించాలి. అదే మన మనో వాక్కాయలతో చేసే కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాలనిస్తున్నది. కనుక, మనం అంతరాత్మనే ప్రార్థించాలి.

మరొక చోట ఆ సూక్ష్మతమ తత్త్వమైన దేవుని గురించి మరికొంత వివరిస్తూ ఏమంటుందంటే -

1. **ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్** - యజుర్వేదం (40-1)

సూక్ష్మతమతత్త్వమై అన్నిటిలో వ్యాపించి నడిపిస్తున్న ఈశుడు నియమాక శక్తి ఈ జగత్తులో ఏకించిత్ కలదో - అణుపరమాణువులలో కలదో అదే తత్త్వం విశ్వమంతటా వ్యాపించి గ్రహగోళాలన్నిటిని నియమించి నడిపిస్తున్నది. దాని గుణాలను, శక్తి సామర్థ్యాలను వివరిస్తూ మరొక మంత్ర మేమంటున్నదంటే-

2. **స పర్యగాత్+శుక్రమ్+అకాయమ్+అవ్రణమ్+అస్నావిరం**
**శుద్ధమ్ అపాపవిద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః స్వయంభూర్**
**యథాతథ్యతః+ అర్థాన్ వ్యదధాత్+ శాశ్వతీభ్యః సమాభ్యః ॥**

- యజుర్వేదం (40-8)

<u>తాత్పర్యం :</u> ఆ దేవతత్త్వం అంతటా, అన్నిటా వ్యాపించి యున్నది. అది సర్వశక్తిమంతము. స్థూల సూక్ష్మకారణ శరీరాలేవీ లేనిది. వ్రణాలు ఛిద్రాలు లేనిది. నాఢీ బంధనాలు లేనిది - ఏ శరీరాలను దాల్చదు. పాపపుణ్యాలతో బంధింపబడదు. అది కవి - వేదరచయిత, సర్వుల మనస్సులను ఎరుగగలదు. ఎంతటి దుష్టులనైన దండించగలదు. అది స్వయంగా ఉన్నది - దాని ఉనికికి మరొక కారణంలేదు. అట్టి దేవతత్త్వమే ఈ సృష్టిని యథాతథంగా - ఎట్లుండవలెనో అట్లు సృజించినది. ఈ సృష్టి ఎందుకనగా తనతో సమానంగా అనాదిగా ఉంటున్న అల్పజ్ఞ జీవులకొరకే. తాను అనుభవించుట కొరకు కాదు.

3. **ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ అన్యో అభిచాకశీతి ॥**

- ఋగ్వేదం (1-164-20)

<u>తాత్పర్యం :</u> పై ఋగ్వేదమంత్రం సృష్టిని అలంకారికంగా ఒక వృక్షంగా పేర్కొంటూ, జీవదేవుళ్ళను రెండు పక్షులుగా కల్పన చేస్తూ, అందులో ఒక పక్షి వృక్షఫలాలను తింటున్నదనీ మరొకటి తాను తినకుండా తింటున్న పక్షిని, వృక్షాన్ని జాగ్రత్తగా గమనిస్తున్నదనీ వర్ణిస్తున్నది. ఈ మంత్రంయొక్క వాక్యార్థ తాత్పర్యాలు ఈ పుస్తకం అట్ట వెనుక వ్రాయబడ్డాయి. అక్కడ చదువుకోగోరుచున్నాము.

ఇటువంటి వేదమంత్రాలు చాలా ఉన్నాయి. కనుక దేవ, జీవ, ప్రకృతులు మూడునూ వేరువేరుగా అనాదిగా అనంతకాలంపరకు ఉంటూనే ఉంటాయి. "బ్రహ్మసత్యం జగన్మిథ్య, జీవో బ్రహ్మైవ నాపరః" అనే మాటలు వేదసమ్మతం కాదు. ప్రస్థానత్రయం పుస్తకాలు అనేక అద్వైతాలను బోధిస్తాయా? ఆలోచించండి. వాటికి ఆర్యవిద్వాంసులు వ్రాసిన భాష్యాలను చూడండి. వాటిని వేదాలకు అన్వయిస్తూ వ్యాకరణయుక్తంగా వారు వ్రాశారు. అందుకనే ముందు వేదాంగ ఉపాంగాలను అధ్యయనం చేసి అనంతరమే వేదాలను, ఋషులు వ్రాసిన గ్రంథాలను చదువాలని, భాష్యాలు వ్యాఖ్యానాలు చెయ్యాలని విజ్ఞులంటారు. లేకుంటే చాలా పొరపాట్లు వస్తాయి. జగత్ప్రసిద్ధమైన భగవద్గీత వేదోక్త త్రైతవాదాన్ని ఎంత చక్కగా ప్రతిపాదిస్తున్నదో ఈ క్రింది శ్లోకాలలో చూడండి -

**శ్లో॥ ద్వా విమౌ పురుషౌ లోకే క్షరాశ్చాక్షర ఏవ చ ।**
**క్షర స్సర్వాణి భూతాని, కూటస్థోఽక్షర ఉచ్యతే ॥**
**శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।**
**యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః ॥**

- భగవద్గీత (15-16,17)

ఈ శ్లోకాలలో దేవ జీవ ప్రకృతులను పురుషులుగా పేర్కొంటూ: లోకంలో (సృష్టిలో) ఇద్దరు పురుషులున్నారు. అందులో ఒకటి నశించేది, రెండవది నశించనిది. సర్వభూతాలు (పంచ భూతాలు) వాటితో ఏర్పడిన పదార్థాలు నశించే గుణం కలివి. అంటే - మార్పు చెందుతూ చివరకు నశించి పోతాయి. ఇచట నాశనమంటే 'కారణలయః' - తనమూల కారణంలో (మూల పదార్థంలో) లయించి పోవటం. ప్రాకృతిక పదార్థాలన్నీ మూల ప్రకృతినుండి పుట్టాయి కనుక మరల మూల ప్రకృతిగా (అవ్యక్తంగా) మారిపోతాయి. అప్పుడు దానిని ప్రలయం అంటారు. 432 కోట్ల సంవత్సరాలు అట్లే ఉండి, మరల సృష్టిగా మారతాయి. అంటే - దేవుడు, ఆ జడ పదార్థాన్ని ఒకప్పుడు సృష్టిగాను తదుపరి ప్రలయంగాను మారుస్తూ ఉంటాడన్న మాట. రెండవ పురుషుడైన కూటస్థుడు - దేహేంద్రియ కూటమిలో ఉన్న జీవుడు అక్షరుడు. ప్రకృతివలె మార్పు చెందనివాడు.

వీరిద్దరేకాక మరొక పురుషుడున్నాడు. అతడిని పరమాత్మగా వేద శాస్త్రాలలో పేర్కొనబడినది. అది త్రిలోకాలలోను (భూ అంతరిక్ష ద్యులోకాలను) ఆవహించి వ్యాపించి ఉన్నది. అది అవ్యయము. మార్పు చెందనిది. అంతేకాక అది ఈశ్వరుడు - అన్నిటికి (జీవప్రకృతులకు) స్వామి (superintendent).

ఈ భగవద్గీత శ్లోకాలు దేవ జీవ ప్రకృతులను పురుషులంటున్నాయి.

అంటే మగవారనికాదు. 'పురుష' పదమునకు బ్రహ్మాండ పురమంతా శయనించి - ఆక్రమించి ఉన్నాడు కనుక దేవుడు ఉత్తమ పురుషుడు. జీవుడు అణుపరిమాణుడే అయినా అతని శక్తి దేహపురమంతా శయనించి వ్యాపించి ఉంటుంది కనుక మధ్యమ పురుషుడు. ప్రకృతి సృష్టి అంతా శయనించి ఉంటుంది. విస్తరించి ఉంటుంది. అది జ్ఞానం లేని
జడపదార్థం. కనుక అది సామాన్య పురుషుడని పై శ్లోకాలలో పేర్కొనబడ్డాయి. ఈ మూడుతత్త్వాలు సృష్టిలోనేకాక మన శరీరాలలోను స్పష్టంగా అనుభవగోచరమౌతాయి. అది వైజ్ఞానికంగా కూడా ఉంటుంది.

## మన శరీరంలో త్రైతవాదం - పూర్తిగా వైజ్ఞానికం

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" అనే పూర్వ పుటలోని వేదమంత్రం మన శరీరానికి కూడా అన్వయిస్తుంది. అలంకారికంగా మన శరీరాన్ని వృక్షమనుకుంటే - ప్రకృతి అనుకుంటే దీనిలో రెండు పక్షులు (చేతన తత్త్వాలు) కనబడతాయి. అందులో ఒకటి మనం. జీవాత్మలం. నా కాలు, నా చేయి, నా తల అనుకుంటూ మనం శరీరంకన్నా వేరుగా ఉన్నాము. మనకు కొద్దిగా జ్ఞానం కూడా ఉంది. కనుక వేదం మనను సుపర్ణులు అంటుంది. జ్ఞానం, ప్రయత్నం (కర్మలు) అనే రెండు రెక్కలతో మన లక్ష్యం వైపు ఎగిరిపోతూ ఉంటాము. మనకు అభిరుచిగల ఆ యా రంగాలలో ఉన్నతోన్నత శిఖరాలకు చేరుకుంటూ ఉంటాము.

మనకు శరీరం సాధనంగా ఉంటుంది. దానికి జ్ఞానం లేదు. అది మనం తినే ఆహారంతోనే పెరిగి పెద్దదయ్యింది. శక్తివంతమయ్యింది. ఆహారం భూమి నుండి వచ్చిందేకదా! త్రాగే పానీయాలు, పీల్చేగాలి, పంచభూతాలలోనివే కదా! వాటిలో జ్ఞానంలేదు కనుక వాటి నుండి ఉత్పన్నమయిన ఆహార పానీయాదులలోను జ్ఞానం ఉండదు. జ్ఞానం లేని ఆహార పానీయాలతో ఏర్పడిన శరీరంలో కూడా జ్ఞానం ఉండదు. అందుచే దానిని వృక్షంతో పోల్చింది వేదం. భూమినుండి ఉత్పన్నమయిన వృక్షం కొంతకాలం తదుపరి మరల భూమిలో కలిసిపోయినట్లే మన శరీరాలును కాలాంతరంలో భూమిలో కలిసిపోతాయి. కనుక శరీరం వృక్షంతో సమానం.

ఇక మూడవ తత్త్వం దేవుని గురించి వైజ్ఞానికంగా ఆలోచిద్దాము. మన శరీరంలో కాళ్లు చేతులు ఇంద్రియాలు మన స్వాధీనంలోనే ఉన్నాయి. ఏదైనా వ్యాధి ఉంటే తప్ప చాలా వరకు అవన్నీ మనం చెప్పినట్టే వింటాయి. కాని గుండె, ఊపిరితిత్తులు, జీర్ణమండలం, రక్త ప్రసార లింఫ్ ప్రసార మండలాలు, మూత్ర పిండాలు, వివిధ గ్రంథులు మన ప్రమేయం లేకుండా వాటంతట అవే చాల

తెలివిగా నిర్విరామంగా పనిచేస్తున్నాయి. వాటిని ఎవరు పనిచేయిస్తున్నారు? అవన్నీ జ్ఞానంలేని ఆహారపానీయాలతో నిర్మింపబడినవేకదా! ఆధునిక వైద్యులు కొన్ని హార్మోన్ల ప్రభావంతో అవి పనిచేస్తున్నాయంటారు. కొందరు మెదడు పంపే సంకేతాలవల్ల అంటారు. అవి కూడా ఆహార పానీయాలతో నిర్మింపబడినవే కదా! వాటిలో లేని జ్ఞానం ఆ యా అవయాల కెలావచ్చింది? కొందరు శరీర కణాలలోని క్రోమోజోమ్స్ మరియు అందలి జీన్స్ కారణమంటారు. అవి కూడా మాంసకృత్ నిర్మితాలే. అవికూడా జడములే. జ్ఞానంలేనివే. కొందరిలో ఆ జీన్స్ వక్రించి దీర్ఘవ్యాధులను, నయం కాని వ్యాధులను కలిగిస్తున్నాయి. ఎందుచేత?

ఒక వేళ వీటిని జీవాత్మ కలిగిస్తున్నదా? జీవాత్మలంటే మనమేకదా! మనకి మనం జీన్సును చెడగొట్టుకొని వ్యాధులను కలిగించుకుంటామా? అసలు మనకట్టి శక్తి, జ్ఞానం ఉన్నాయా? మనకు రుచిగా వండుకొని తినటం వరకు తెలుసు. గొంతుదాటి లోపలికివెళ్లి ఏ ఏ మార్పులుచెంది జీర్ణంఅవుతున్నదో తెలియదు. ఏదైనా బాధవస్తే తప్ప లేకుంటే కడుపు ఉన్నట్టే స్మృతి ఉండదు. అట్లే మన శరీరంలో ఎన్నెన్నో అవయవాలు గ్రంథులు ఉన్నాయి. వాటిలో ఏవైనా వ్యాధులు బాధలు వస్తేనే అవి మన స్మృతిలోకి వస్తాయి, లేకుంటే శరీరం మువ్వలాగా తేలికగా ఉంటుంది. ఎన్నెన్నో ఆటలు, కళలు అభ్యసిస్తాము. సత్కారాలను పురస్కారాలను అందుకుంటాము. కనుక అమ్మకడుపులో మనకీ శరీరాన్ని నిర్మించినదీ, ఇప్పుడు జీవింపచేస్తున్నది మరొక తత్త్వం ఉంది. అదే దేవతత్త్వం. ఈ విధంగా మన శరీరంలోనే ప్రకృతితత్త్వం, జీవతత్త్వం, దేవతత్త్వం ఉన్నాయి. త్రైతవాదం మన శరీరంలోనే ఉంది.

సూక్ష్మంగా ఆలోచిస్తే మన శరీరంలో ఎన్నో వింతలు విడ్డూరాలు కనబడతాయి. శరీర నిర్మాణ శాస్త్రం, (Anatomy), శరీర ధర్మశాస్త్రం (Physiology) చదివితే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. మనం పీల్చుకునే గాలిలో ఆక్సిజన్‌కన్నా నైట్రోజన్ 3 రెట్లు ఎక్కువగాఉన్నా ఊపిరితిత్తులు ఆక్సిజన్‌ను మాత్రమే గ్రహిస్తాయి. గుండె ఆ ఆక్సిజన్‌ను, ఆహారసారాన్ని శరీరంలోని ప్రతికణానికి పంపిస్తుంది. రక్తం అక్కడున్న మలినాలను తీసుకెళ్లి మూత్ర పిండాలలో శుద్ధిచేస్తుంది. ఎంత చక్కని ఏర్పాటు! వాటిని ఆ విధంగా నిర్మించిన దేవతత్త్వం అనంత జ్ఞానం, అనంత శక్తి సామర్థ్యాలు గలదని అర్థమౌతున్నదికదా! ఇంతేకాక, మనం మనస్సుతో చేసే పాపపు ఆలోచనలను, సద్భావాలను కూడా కనిపెడుతూ ఉంటుంది. శరీరంతో, వాక్కుతో చేసే చెడుకర్మలకు చూచినవారు, విన్నవారు మనను కొంత శిక్షించవచ్చు. సాక్ష్యాలన్నీ ఋజువైతే కోర్టులు మరికొన్ని శిక్షలు విధించవచ్చు. కాని మనసులో

హత్యచేసే పథకాలను, కీడుచేసే ఆలోచనలను లోకంలో ఎవరు కనిపెట్టి శిక్షించగలరు? అట్టినాటికి కూడా దేవతత్త్వం తగిన విధంగా శిక్షిస్తుంది. ఆ ఆలోచనలు కార్యరూపం ధరించే సమయంలో ముందు దయతో హెచ్చరించి చూస్తుంది. భయాన్ని, సంకోచాన్ని కలిగించి చూస్తుంది. ఆ హెచ్చరికను, ప్రేరణను అర్థం చేసుకున్న బుద్ధిమంతులు ఆ చెడుకర్మ చేయకుండా ఇంద్రియాలను నిగ్రహించుకుంటారు. గీతలో (2-58లో) చెప్పినట్లు తనకేదైనా కీడు, ఆపద జరుగబోతోందని గుర్తిస్తే తాబేలు వెంటనే తన తలను, కాళ్లను లోపలికి ముడుచుకొని ఒక డిప్పలా అయిపోతుంది. అట్లే స్థితప్రజ్ఞుడు (బుద్ధిమంతుడు) అంతర్యామి ప్రేరణలను గుర్తించి తన యింద్రియాలను నిగ్రహించుకుంటాడు. ఆ చెడుపని చేయకుండా ఆగిపోతాడు పశ్చాత్తాపపడతాడు.

అట్లే, మనం ఏదైనా మంచిపనులు- దానం ధర్మం త్యాగం పరోపకారం మొదలగునవి చేస్తున్నప్పుడు మనకు లోపలినుండి ఆనందం, ప్రోత్సాహం, ధైర్యం, సహనం మొదలగునవి కలుగుతాయి. కనుకనే మన దేశస్వాతంత్ర్య సమరంలో దేశభక్తులు, క్రాంతికారులు అంతటి పెద్ద పెద్ద శిక్షలను, క్రూరమైన హేయమైన శిక్షలనుకూడా 'వందే మాతరం' అనుకుంటూ సంతోషంగా అనుభవించారు. మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టారు. ఇట్టి అంతర్యామి ప్రేరణలే దైవతత్త్వం ప్రత్యక్షమౌతున్నట్లు నిరూపిస్తున్నాయంటారు దయానంద మహర్షి తమ 'సత్యార్థ ప్రకాశం' సప్తమ సముల్లాసంలో. ఇది చాల సూక్ష్మ విషయం దానిని అక్కడ మహర్షి మాటలలోనే చదవండి. ఆయన అక్కడ ప్రత్యక్ష, అనుమాన, శబ్దాది అన్ని ప్రమాణాలతోను సరియైన దైవతత్త్వాన్ని తర్కంతో నిరూపించారు. "యత్తర్కేన అనుసందత్తే స ధర్మః" - తర్కానికి నిలబడేదే ధర్మం అంటారు మన మహర్షులంతా. మనం వారి మార్గాన్ని అనుసరించటమే ఉత్తమం. మూఢ నమ్మకాలతో ముక్తి పొందటం అసాధ్యం. మనం ఏ రూపాన్ని ధ్యానిస్తే ఆ రూపంలోనే దేవుడు దర్శనమిస్తాడని కొందరు గురువులు ఉపదేశిస్తూ ఉంటారు. ఇది వారి వట్టి భ్రమ. దేవుడు ఎలా ఉంటాడో సరిగా తెలుసుకొని ఉపాసించమని వేదం స్పష్టంగా చెబుతుంది.

"తమేవ విదిత్వా అతి మృత్యుమేతి నా ఽ న్యః పంథా విద్యతే అయనాయ"- యజుర్వేదం (31-18) అంటుంది. మరొక మార్గం లేనే లేదంటుంది. స్వాహా - ఇది పూర్ణసత్యం.

# ముగింపు మాటలు (CONCLUSION)

ప్రియపాఠకులారా!

ప్రపంచ ఆధ్యాత్మిక క్షేత్రంలో వివిధ మతాలు సంప్రదాయాలు అన్నీ దేవ జీవ ప్రకృతుల విషయంలోనే భిన్న భిన్న అభిప్రాయాలు కలిగి ఉన్నాయి. వారు నమ్మిన గ్రంథాలు, గురువులు చెప్పేదే సత్యమని నమ్మి దానిని అనుసరిస్తున్నారు. ఎవరి నమ్మకం వారిదంటున్నారు. కేవలం గట్టి నమ్మకమే దేవున్ని చేరుస్తుందంటున్నారు. కాని మనం నమ్మినట్టు సృష్టి, సృష్టిలోని పదార్థాలు ఉండవు. వాటి యథార్థ స్వరూపం ఏమిటో మనమే పరిశోధించి తెలుసుకోవలసి వస్తుంది. దేవ జీవ మూలప్రకృతులు మూడూ సూక్ష్మ విషయాలు. వాటిని మన ఇంద్రియాలతో గాని సూక్ష్మ దర్శని (Microscope) , దూరదర్శని (Telescope) మొదలైన వాటితో గాని తెలుసుకోలేము. కేవలం బుద్ధితో మాత్రమే తెలుసుకోగలం. కనుకనే యోగేశ్వర శ్రీకృష్ణుడు "బుద్ధిగ్రాహ్యం అతీంద్రియం" అన్నాడు భగవద్గీతలో.

మేమింతవరకు దేవ జీవ ప్రకృతులను గురించి సంక్షిప్తంగా, స్పష్టంగా, హేతుబద్ధంగా, వైజ్ఞానికంగా మీ ముందుంచాము. కనుక సృష్టికర్త మీ కిచ్చిన బుద్ధిని పదును పెట్టుకొని సద్వినియోగం చేసుకోండని విజ్ఞప్తి చేస్తున్నాము. ఈ విషయాలను మీ బుద్ధితో మనన చింతనలు చేసి సత్యాన్ని గ్రహించండి. అసత్యాన్ని వదిలి పెట్టండి. సత్యమని నమ్మినదానిని ఆచరించండి. ప్రచారం చెయ్యండి. హోమియో వైద్య పితామహుడైన డా. హానిమన్ ఎమ్.డి. (జర్మనీ) ఏమన్నాడంటే - " **Aude Sapare - Dare to be wise** - విజ్ఞాన వంతుడగుటకు సాహసింపుడు" అన్నాడు. సంస్కర్తలంతా అదే చేశారు. కనుకనే ఎంతో మంది రక్షింపబడ్డారు. తరతరాలు వారిని స్మరిస్తున్నారు. ప్రేరణను పొందుతున్నారు. కనుక మీరును వారి మార్గాన్ని అనుసరించండి.

సర్వాంతర్యామియైన దేవుడు మీకు వివేకబుద్ధిని ప్రసాదించునుగాక! మార్గదర్శనం చేయునుగాక! మీరంతా అభ్యుదయంతో బాటు నిఃశ్రేయసాన్ని - సర్వదుఃఖ నివృత్తిరూప మోక్షాన్ని పొందుదురుగాక!

ఓ3మ్ శాన్తిః శాన్తిః శాన్తిః

- సుమ్మార్థి

(గ్రంథకర్త)



# వైదిక శాంతిపాఠం

## Vedic Shanthi Prayer

ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః, పృథివీ శాంతి
రాపః శాంతిః, ఓషధయః శాంతిః వనస్పతయః శాంతిః ।
విశ్వేదేవాః శాంతిః బ్రహ్మశాంతిః సర్వగ్ం శాంతిః,
శాంతిరేవ శాంతిః, సా మా శాంతి రేధి ॥

- యజుర్వేదం (36-17)

ద్యు లోకము, అంతరిక్షము, భూమి జలము ఓషధులు, వనస్పతులు ఎల్ల విద్వాంసులు, వేదము, సంపూర్ణ ప్రపంచము, స్వయముగా శాంతియై శాన్తి నిచ్చుగాక! ఆ శాంతి నన్ను చేరి వర్ధిల్లు గాక!

May sky be peaceful. May atmosphere be peaceful. May Earth be peaceful. May waters be peaceful. May medicinal herbs be peaceful. May plants be peaceful. May all the learned persons be peaceful. May God and the Vedas be peaceful. May all the objects be peaceful. May peace itself be peaceful. May that peace come unto me.

# మహర్షి డా. కోడూరు సుబ్బారావు గారి ఇతర రచనలు

| క్రమం | పుస్తకం పేరు | ధర |
|---|---|---|
| 1 | గాయత్రీ విజ్ఞానం | 50.00 |
| 2 | గాయత్రీ మహిమ | 30.00 |
| 3 | మన ఇతిహాసం | 70.00 |
| 4 | మన వేదశాస్త్రాల పరిచయం | 50.00 |
| 5 | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ | 60.00 |
| 6 | అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం | 60.00 |
| 7 | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ | 20.00 |
| 8 | అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము | 30.00 |
| 9 | గోమాత | 30.00 |
| 10 | వేదాలలో సూర్యకిరణ చికిత్స | 40.00 |
| 11 | వేదాలలో జల చికిత్సా విజ్ఞానము | 20.00 |
| 12 | పెండ్లినాటి ప్రమాణాలు | 40.00 |
| 13 | గర్భాధాన విజ్ఞానము | 30.00 |
| 14 | దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణీ స్త్రీ) | 30.00 |
| 15 | మరణానంతరం జీవుని ప్రయాణం | 40.00 |
| 16 | మానవ ధర్మము | 25.00 |
| 17 | వేదాలలో అశ్వనీ దేవతలు | 20.00 |
| 18 | సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము | 20.00 |
| 19 | అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము | 15.00 |
| 20 | వైదిక క్రాంతిపథం | 15.00 |
| 21 | వేదాల వెలుగుచూపే ఆర్యసమాజం | 20.00 |
| 22 | పురుష సూక్తము (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20.00 |
| 23 | సరస్వతీ సూక్తము | 10.00 |
| 24 | ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ | 10.00 |
| 25 | చతుర్దశ భువనములు | 10.00 |
| 26 | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం | 10.00 |
| 27 | గంగాధర శివుడు | 5.00 |
| 28 | ఈశావాస్య మిదం సర్వం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 35.00 |
| 29 | వైదిక శాంతిపాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20.00 |
| 30 | ప్రణవ స్తోత్రము (అర్థ సహితం) | 10.00 |
| 31 | మహర్షి దయానందుడు | 10.00 |
| 32 | శివరాత్రి రహస్యము | 3.00 |
| 33 | పండుగల పరమార్థం | 40.00 |
| 34 | వేదాలలో వర్షేష్టి విజ్ఞానం | 25.00 |
| | | |

Gayatri Series : 62

**GOD - SOUL - NATURE....** Price : **Rs. 30/-**



ఓం ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి+అనశ్నన్+అన్యో అభిచాకశీతి॥

- ఋగ్వేదం (1-164-20).

వాక్యార్థం :

ద్వా సుపర్ణా సయుజా సఖాయా = మంచి రెక్కలుగల రెండు పక్షులు - జీవాత్మ పరమాత్మలు వ్యాప్యావ్యాపకములుగా కలిసియున్నవి. ఎప్పుడూ అవి రెండును మిత్రులే - అనాదులే.

సమానం వృక్షం పరిషస్వజాతే = ఈ రెండు వృక్షరూప విశ్వంలో వసించుచున్నవి.

తయోర్+అన్యః పిప్పలం స్వాదు+అత్తి= వాటిలో ఒకటి - జీవాత్మ సృష్టివృక్షంలోని ఫలములను - విషయాలను తింటున్నది- అనుభవిస్తున్నది.

అనశ్నన్+అన్యః+అభిచాకశీతి = మరొకటి - పరమాత్మ. తానేవీ విషయాలను అనుభవించకుండా అన్నిటిని చక్కగా పరిశీలిస్తున్నది.

Two birds like substances - God and soul whose acts and knowledge are beautiful in their spheres and who are residing together and like friends, rest of the tree like material cause, the utter which is of the time of same eternity. One of the twain the soul eats the sweet and palatable fruit of the tree which the other (God) eating not, sees like an indifferent spectator.

Published by :

**GAYATRI ASHRAM TRUST**

12-10-586/6, Arya Samaj - Vyasnagar, Medibavi,
Seethaphalmandi, Secunderabad - 500 061. (Telangana)
**Cell : 9908994084, 9848011073, 9948539795.**